## అథ ఏకత్రింశోeôధ్యాయః

## శివమాయ

బ్రహ్మోవాచ |

తయోర్భక్తిం శివే జ్ఞాత్వా పరమవ్యభిచారిణీమ్ | సర్వే శక్రాదయో దేవాశ్చిచింతురితి నారద || 1

బ్రహ్మ ఇట్లు పలికెను-

శివుని యందు వారిద్దరికి అనన్యమగు పరాభక్తి గలదని ఇంద్రాది దేవలందరికీ తెలిసినది. ఓ నారదా! అపుడు వారు ఇట్లు తలపోసిరి. (1).

దేవా ఊచుః |

ఏకాం భక్త్యా శైలశ్చేత్కన్యాం తసై#్మ ప్రదాస్యతి | ధ్రువం నిర్వాణతాం సద్యస్స ప్రాప్స్యతి చ భారతే || 2

అనంత రత్నాధారశ్చేత్పృథ్వీం త్యక్త్వా ప్రయాస్యతి | రత్న గర్భాభిధా భూమేర్మి థ్యైవ భవితా ధ్రువమ్ || 3

స్థావరత్వం పరిత్యజ్య దివ్యరూపం విధాయ సః | కన్యాం శూలభృతే దత్త్వా శివలోకం గమిష్యతి || 4

మహాదేవస్య సారూప్యం లప్స్యతే నాత్ర సంశయః | తత్ర భుక్త్వా వరాన్ భోగాంస్తతో మోక్షమవాప్స్యతి || 5

దేవతలిట్లు పలికిరి -

హిమవంతుడు అనన్య భక్తితో శివునకు కన్యాదానమును చేసినచో, భారత ఖండమునందు ఆతడు వెనువెంటనే మోక్షమును పొందును (2). అనంత రత్నములకు ఆధారమగు నాడతు భూలోకమును వీడి

పయనమైనచో, భూమియొక్క రత్నగర్భయను బిరుదు మిథ్య యగుట నిశ్చయము (3). ఆతడు కన్యను శూలధారియగు శివునకిచ్చి పర్వతరూపమును విడిచిపెట్టి దివ్యరూపమును ధరించి శివలోకమును పొందగలడు (4). ఆతడు మహాదేవునితో సారూప్యమును పొంది, అచట శ్రేష్ఠమగు భోగముల ననుభవించి తరువాత మోక్షమును పొందగలడు. దీనిలో సందేహము లేదు (5).

బ్రహ్మోవాచ|

ఇత్యాలోచ్య సురాస్సర్వే కృత్వా చామంత్రణం మిథః | ప్రస్థాపయితు మై చ్ఛంస్తే గురుం తత్ర సువిస్మితాః || 6

తతశ్శక్రాయో దేవాస్సర్వే గురునికేతనమ్ | జగ్మః ప్రీత్యా సవినయా నారద స్వార్థ సాధకాః || 7

గత్వా తత్ర గురుం నత్వా సర్వే దేవాస్సవాసవాః | చక్రుర్నివేదనం తస్మై#ృ గురవే వృత్త మాదరాత్ || 8

బ్రహ్మ ఇట్లు పలికెను -

దేవతలందరు ఇట్లు తలపోసి ఒకరితో నొకరు సంప్రదించుకొని చకితులై హిమవంతుని వద్దకు బృహస్పతిని పంపవలెనని తలంచిరి (6).అపుడు ఇంద్రుడు మొదలుగా గల దేవతలందరు తమ ప్రయోజనమును సాధింపబూని వినయముతో గూడినవారై ప్రీతితో బృహస్పతి గృహమునకు వెళ్లిరి. ఓ నారదా! (7) ఇంద్రాది దేవతలు అందురు అచటకు వెళ్లి, బృహస్పతికి నమస్కరించి జరుగుతున్న వృత్తాంతమును సాదరముగా ఆయనకు నివేదించిరి (8).

దేవ ఊచుః |

గురో హిమాలయ గృహం గచ్ఛాస్మత్కార్య సిద్ధయే | తత్ర ప్రయత్నేన కురు నిందాం చ శూలినః || 9

పినాకినా వినా దుర్గా వరం నాన్యం విరిష్యతి | అనిచ్ఛయా సుతాం దత్త్వా ఫలం తూర్ణం లభిష్యతి || 10

కాలేనైవాధునా శైల ఇదానీం భువి తిష్ఠతు | అనేకరత్నాధారం తం స్థాపయ త్వం క్షితౌ గురో || 11

దేవతలిట్లు పలికిరి-

గురుదేవా! మా కార్యమును సంపాదించుటకై హిమవంతుని వద్దకు వెళ్లుము. అచటకు వెళ్లి ప్రయత్నపూర్వకముగా శూలధారియగు శివుని నిందించుము (9). దుర్గ పినాక ధారియగు శివుని తక్క మరియొకనిని వివాహమాడబోదు. ఆయన ప్రీతి లేకుండగా తన కుమార్తెను ఆయనకు దానము చేసినచో, వెంటనే ఫలము లభించును (10). కాని ప్రస్తుతము హిమవంతుడు భూమియందు మాత్రమే ఉండగలడు. కావున, ఓ గురుదేవా! అట్లు చేసి అనేకరత్నములకు ఆశ్రయమగు హిమవంతుని భూమియందు స్థిరముగా నుండునట్లు నీవు చేయుము (11).

బ్రహ్మోవాచ|

ఇతి దేవవచశ్శ్రుత్వా ప్రదదౌ కర్ణయోఃకరమ్ | న స్వీచకార స గురు స్స్మరన్నామ శివేతి చ || 12

అథ స్మృత్వా మహాదేవం బృహస్పతిరుదారధీః | ఉవాచ దేవవర్యాంశ్చ ధిక్ కృత్వా చ పునః పునః || 13

బ్రహ్మ ఇట్లు పలికెను-

దేవతల ఈ మాటను విని బృహస్పతి శివుని నామమును స్మరిస్తూ చెవులను మూసుకొనెను. ఆయన వారి కోరికను అంగీకరించలేదు (12). అపుడు విశాల హృదయుడగు బృహస్పతి మహాదేవుని స్మరించి, దేవతలను అనేక పర్యాయములు నిందించి వారితో నిట్లనెను (13).

బృహస్పతిరువాచ|

సర్వే దేవాస్స్వార్థపరాః పరార్థ ధ్వంసకారకాః | కృత్వా శంకరనిందాం హి యాస్యామి నరకం ధ్రువమ్ || 14

కశ్చిన్మధ్యే చ యుష్మాకం గచ్ఛేచ్ఛై లాంతికం సురాః | సంపాదయేత్స్వాభిమతం శైలేంద్రం ప్రతిబోధ్య చ || 15

అనిచ్ఛయా సుతాం దత్వా సుఖం తిష్ఠతు భారతే | తస్మై#్మ భక్త్యా సుతాం దత్త్వా మోక్షం ప్రాపస్యతి నిశ్చితమ్ || 16

పశ్చాత్సప్తర్షయస్సర్వే బోధయిష్యంతి పర్వతమ్ | పినాకినా వినా దుర్గావరం నాస్యం పరిష్యతి || 17

అథవా గచ్ఛత సురా బ్రహ్మలోకం సవాసవాః | వృత్తం కథయత స్వం తత్సవః కార్యం కరిష్యతి|| 18

బృహస్పతి ఇట్లు పలికెను-

దేవతందరు తమ లాభమును సంపాదించుకొని, ఇతరుల కార్యమును ధ్వంసము చేయుట యందు నిమగ్నులైయున్నారు. శంకరుని నేను నిందించినచో నాకు నరకప్రాప్తి తప్పని సరియగును (14). ఓ దేవతలారా ! మీలో ఒకడు హిమవంతుని వద్దకు వెళ్లి ఆయనకు బోధించి మీ కోర్కెను నెరవేర్చుకొనుడు (15). ఆయన శివునకు భక్తితో కన్యాదానమును చేసి మోక్షమును పొందుట నిశ్చితము. కాని ప్రీతి లేకుండగా కుమార్తెను ఇచ్చినచో భారత ఖండమునందు సుఖముగ నుండగలడు (16). మీలో ఒకరు వెళ్లి వచ్చిన తరువాత సప్తర్షులందరు వెళ్లి ఆ పర్వతునకు ఉపదేశించగలరు. దుర్గాదేవి పినాకధారియగు శివుని తక్క మరియొకనిని వివాహమాడదు (17). ఓ దేవతలారా! అట్లు గానిచో, మీరు ఇంద్రుని దోడ్కొని బ్రహ్మలోకమునకు వెళ్లుడు. మీ వృత్తాంతమును ఆయనకు చెప్పుడు. ఆయన మీ కార్యమును చక్కబెట్టగలడు (18).

బ్రహ్మోవాచ |

తచ్ఛ్రుత్వా తే సమాలోచ్య జగ్ముర్మమ సభాం సురాః | సర్వే
నివేదయాం చక్రుర్నత్వా తద్ధత మాదరాత్ || 19

దేవానాం తద్వచశ్శ్రుత్వా శివనిందాకరం తదా | వేదవక్తా విలప్యాహం
తానవోచం సురాన్మునే || 20

నాహం కర్తుం క్షమో వత్సా శ్శివ నిందాం సుదుస్సహామ్ |
సంపద్వినాశ రూపం చ విపదాం బీజరూపిణీమ్ || 21

సురా గచ్ఛత కైలాసం సంతోషయత శంకరమ్ | ప్రస్థాపయత తం
శీఘ్రం హిమాలయ గృహం ప్రతి || 22

బ్రహ్మ ఇట్లు పలికెను-

ఆ దేవతలందరు ఆ మాటను విని ఆలోచించుకొని నా సభకు విచ్చేసిరి. వారందరు అచట నున్న నాకు సాదరముగా నమస్కరించి విన్నవించరి (19). శివనిందను ప్రస్తావించే ఆ దేవతల మాటను విని వేదములను ప్రవర్తిల్ల జేసిన నేను విలపించితిని. ఓ మహర్షీ! అపుడు నేను దేవతలతోనిట్లంటిని (20). వత్సలారా! సంహిప శక్యము కానిది, సంపదలను నశింపజేయునది, ఆపదలకు బీజభూతమైనది అగు శివనిందను నేను చేయజాలను (21). దేవతలారా! కైలాసమునకు పోయి, శంకరుని ప్రసన్నునిగా చేసుకొని, ఆయనను వెనువెంటనే హిమవంతుని గృహమునకు ప్రయాణము కట్టించుడు (22).

స గచ్ఛేదుపశైలేశ మాత్మనిందాంకరోతువై | పరనిందా వినాశాయ
స్వనిందా యశ##సే మతా || 23

శ్రుత్వేతి మద్వచో దేవా మాం ప్రణమ్య ముదా చతే | కైలాసం
ప్రయయుశ్శీఘ్రం శైలానామధిపం గిరిమ్ || 24

తత్రత గత్వా శివం దృష్ట్వా ప్రణమ్య నతమస్తకాః |
సుకృతాంజలయస్సర్వే తుష్టుపుస్తం సురా హరమ్ || 25

ఆయన పర్వతరాజు వద్దకు వెళ్లి ఆత్మనిందను చేయుగాక! పరనింద వినాశమును, ఆత్మనింద కీర్తిని కలిగించునని పెద్దలు చెప్పెదరు (23). దేవతలు నా ఈ మాటను విని ఆనందముతో నాకు ప్రణమిల్లి పర్వత శ్రేష్ఠమగు కైలాసమునకు వెనువెంటనే పయనమైరి (24). ఆ దేవతలు అచటకు వెళ్లి శివుని చూచిరి. వారందరు తలలు వంచి, చేతులు జోడించి నమస్కరించి శివుని స్తుతించిరి (25).

దేవా ఊచుః |

దేవ దేవ మహాదేవ కరుణాకర శంకర | వయం త్వాం శరణాపన్నాః కృపాం కురు నమోస్తు తే || 26

త్వం భక్తవత్సల స్వామిన్ భక్త కార్య కరస్సదా | దీనోద్ధరః కృపాసింధు ర్భక్తాపద్వినిమోచకః || 27

దేవతలిట్లు పలికిరి -

ఓ దేవదేవా! మహాదేవా! కరుణానిధీ! శంకరా! మేము నిన్ను శరణుజొచ్చితిమి. దయను చూపుము. నీకు నమస్కారమగుగాక! (26) ఓ స్వామీ! నీవు భక్తవత్సలుడవు. ఎల్ల వేళలా భక్తుల కార్యములను సిద్ధింపజేసెదవు. దీనుల నుద్ధరించు దయానిధివి నీవే. నీవు భక్తుల ఆపదలను తొలగించెదవు (27).

బ్రహ్మోవాచ|

ఇతి స్తుత్వా మహేశానం సర్వే దేవాస్సవాసవాః | సర్వం నివేదయాం చక్రుస్తద్వృత్తం తత ఆదరాత్ || 28

తచ్ఛ్రుత్వా దేవవచనం స్వీచకార మహేశ్వరః | దేవాన్సుయాపయా మాస తానశ్వాస్య విహస్య సః || 29

దేవా ముముదిరే శీఘ్రం సర్వే గత్వా స్వమందిరమ్ | సిద్ధం మత్వా స్వకార్యం హి ప్రశంసంత స్సదా శివమ్ || 30

తతస్స భగవాన్ శంభుర్మహేశో భక్తవత్సలః | ప్రయ¸° శైల భూపం చ మాయేశో నిర్వికారవాన్ || 31

యదా శైలస్యభామధ్యే సమువాస ముదాన్వితః | బంధువర్గైః పరివృతః పార్వతీ సహిత స్స్వయమ్ || 32

బ్రహ్మ ఇట్లు పలికెను-

ఇంద్రాది దేవతలందరు మహేశ్వరుని ఇట్లు స్తుతించి, తరువాత జరిగిన వృత్తాంతమునంతనూ సాదరముగా నివేదించిరి (28). దేవతల ఆ మాటలను విని ఆ మహేశ్వరుడు అంగీకరించెను. ఆయన నవ్వి, దేవతలనోదార్చి వారిని పంపివేసెను (29). దేవతందరు ఆనందించి తమ కార్యము సిద్ధించినదని ఎరింగిన వారై, సదాశివుని కొనియాడుతూ తమ గృహములకు వెళ్లిరి (30).అపుడు భక్తవల్సలుడు, మహేశ్వరుడు, మాయావతి, వికార రహితుడునగు ఆ శంభు భగవానుడు హిమవంతుని వద్దకు బయలు దేరెను (31). హిమవంతుడు సభామధ్యములో బంధువర్గముతో, స్వయముగా పార్వతితో గూడి ఆనందముగా కొలువు దీరి యుండెను (32).

ఏతస్మిన్నంతరే తత్ర హ్యాజగామ సదాశివః | దండీ ఛత్రీ దివ్యవాసా బిభ్రత్తిలకముజ్జ్వలమ్ || 33

కరే స్పటికమాలాం చ శాలగ్రామ గలే దధత్ | జపన్నామ హరేర్భక్త్యా సాధువేషధరో ద్విజః || 34

తం చ దృష్ట్వా సముత్త స్థౌ సగణోeôపి హిమాలయః | ననామ దండవద్భూమౌ భక్త్యా తిథి మపూర్వకమ్ || 35

ననామ పార్వతీ భక్త్యా ప్రాణ   శం విప్రరూపిణిమ్ | జ్ఞాత్వా తమ మనసా దేవీ తుష్టావ పరయా ముదా || 36

ఇంతలో అచటకు సదాశివుడు ఏతెంచెను ఆయన దండమును, ఛత్రమును పట్టుకొని, దివ్యమగు వస్త్రములను, ప్రకాశించే తిలకమును ధరించు యుండెను (33). ఆయన చేతిలో స్ఫటికమాలను, మెడలో సాలగ్రామమును ధరించి, హరినామమును భక్తితో జపించుచుండెను. ఆ బ్రాహ్మణుడు సాధువేషమును ధరించి యుండెను (34). ఆయనను చూచి హిమవంతుడు పరివారముతో సహాలేచి నిలబడెను. అపూర్వమగు ఆ అతిధికి భక్తితో సాష్టాంగ నమస్కారము నాచరించెను (35). పార్వతి బ్రాహ్మణ రూపములో నున్న ప్రాణప్రియునకు భక్తితో నమస్కరించెను. ఆ దేవి మనస్సులో ఆయనను గుర్తెరింగి పరమానందముతో స్తుతించెను (36).

ఆశిషం యుయుజే విప్రస్సర్వేషాం ప్రీతిత శ్శివః | శివాయా అధికం తాత మనోభిలషితం హృదా || 37

మధు పర్కాదికం సర్వం జగ్రాహ బ్రాహ్మణో ముదా | దత్తం శైలాధిరాజేన హిమాంగేన మహాదరాత్ || 38

పప్రచ్ఛ కుశలం చాస్య హిమాద్రిః పర్వతోత్తమః | తం ద్విజేంద్రం మహాప్రీత్యా సంపూజ్య విధివన్మునే || 39

పునః పప్రచ్ఛ శైవేశస్తం తతః కో భవానితి | ఉవాచ శీఘ్రం విప్రేంద్రో గిరీంద్రం సాదరం వచః || 40

బ్రాహ్మణ వేషధారియగు శివుడు వారందరిని ప్రీతి పూర్వకముగా నాశీర్వదించెను. వత్సా! ఆయన మనస్సులో పార్వతికి, తనకు నచ్చిన ఆశీస్సులను అధికముగా నిచ్చెను (37). ఆ బ్రాహ్మణుడు పర్వతరాజగు హిమవంతునిచే మహాదరముతో నీయబడిన మధుపర్కము మొదలగు అతిథిపూజను పూర్ణముగా స్వీకరించెను (38). ఓ మునీ! పర్వతరాజగు హిమవంతుడు ఆ బ్రాహ్మణోత్తముని మహాప్రీతితో చక్కగా పూజించి కుశలమడిగెను (39). తరువాత పర్వతరాజు ఆయనను 'మీరెవరు?' అని ప్రశ్నించెను. ఆ బ్రాహ్మణ శ్రేష్ఠుడు వెంటనే సాదరముగా పర్వతరాజుతో నిట్లనెను (40).

విప్రేంద్ర ఉవాచ|

బ్రాహ్మణోeôహం గిరిశ్రేష్ఠ వైష్ణవో బుధసత్తమః | ఘటికీం వృత్తిమాశ్రిత్య భ్రమామి ధరణీ తలే || 41

మనోయాయిా సర్వగామీ సర్వజ్ఞోeôహం గురోర్బలాత్ | పరోపకారీ శుద్ధాత్మా దయాసింధుర్వికారహా || 42

మయా జ్ఞాతం హరాయ త్వం స్వసుతాం దాతుమిచ్ఛసి | ఇమాం పద్మ సమాం దివ్యాం వరరూపాం సలక్షణామ్ || 43

నిరాశ్రయాయాసంగాయ కురూపాయాగుణాయ చ | శ్మ శాన వాసినే వ్యాల గ్రాహిరూపాయ యోగినే || 44

ఆ బ్రాహ్మణశ్రేష్ఠుడిట్లు పలికెను -

ఓ పర్వతరాజా! నేను బ్రాహ్మణుడను, వైష్ణవుడను, మహాపండితుడను. జ్యోతిష వృత్తిని చేపట్టి భూమండలము నందు తిరుగాడు చుందును (41). నేను నాకు నచ్చిన విధముగా తిరిగెదను. అన్ని చోట్లకు వెళ్లుచుందును. గురువు యొక్క అనుగ్రహముచే నాకు సర్వము తెలియును. నేను పరోపకారమును చేయుచుందును. పరిశుద్ధమగు అంతఃకరణము గలవాడను. దయానిదిని. వికారములు లేనివాడను (42). నీవు ఈ పద్మము వంటి దివ్యమైన శ్రేష్ఠరూపము మంచి లక్షణములు గల నీ కుమార్తెను శివునకు ఈయగోరుచున్నావని నాకు తెలిసినది (43). శివుడు ఆశ్రయము లేనివాడు, సంగవిహీనుడు, కురూపి, గుణహీనుడు, శ్మశానమునందు నివసించువాడు. ఆతని శరీరమును పాములు చుట్టుకొని యుండును. ఆయన యోగి (44).

దిగ్వాససే కుగాత్రాయ వ్యాల భూషణ ధారిణ    | ఆజ్ఞాతకుల నామ్నే చ కుశీలాయావిహారిణ    | 45

విభూతి దిగ్ధదేహాయ సంక్రుద్ధా యావివేకినే | అజ్ఞాతవయసేeôతీవ కుజటా ధారిణ   సదా || 46

సర్వాశ్రయాయ భ్రమిణ   పనాగహారాయ భిక్షవే | కుమార్గ నిరతాయాథ వేదాధ్వత్యాగినే హఠాత్ || 47

ఇయం తే బుద్ధి రచల నహి మంగలదా ఖలు | విబోధ జ్ఞానినాం శ్రేష్ఠ నారాయణకులోద్భవ || 48

దిక్కులే వస్త్రముగా గలవాడు, చెడు రూపము గలవాడు, పాములను ఆభరణములుగా ధరించువాడు, కులనామముల నెరుంగనివాడు, చెడు శీలము గలవాడు, విహారము నెరుంగనివాడు (45), విభూతి లేపనముతో గూడిన దేహము గలవాడు, క్రోధస్వభావుడుర, వివేకము లేనివాడు, వయస్సు నెరుంగని వాడు, సర్వదా చిక్కు బడిన జటలను ధరించువాడు (46), సర్వమును ఆశ్రయించి తిరుగువాడు, పాములు హారముగా గలవాడు, భిక్షుకుడు, చెడు మార్గమునందు ప్రీతి గలవాడు, దురహంకారముచే వేదమార్గమును వీడినవాడు (47) అగు శివునకు పార్వతి నీయవలెననే నీ ఈ బుద్ధి మంగళదాయకము కాదు సుమా! హే పర్వతరాజా! నీవు జ్ఞానులలో శ్రేష్ఠుడవు. నారాయణుని కులమునందు జన్మించినవాడవు. తెలుసుకొనుము (48).

న తే పాత్రానురూపశ్చ పార్వతీ దాన కర్మణి | మహాజన స్స్మేరముఖ శ్రుత్వతమాత్రాద్భ విష్యతి || 49

పశ్యశైలాధిపత్వం చన తస్సై#్మకోeôస్తి బాంధవః | మహారత్నాకరస్త్వం చ తస్సై#్మ కించిద్ధనం న హి || 50

బాంధవాన్ మేనకాం కుద్రపతే శీఘ్రుం సుతాంస్తథా | సర్వాన్ పృచ్ఛ ప్రయత్నేన పండితాన్ పార్వతీం వినా || 51

రోగిణో నౌషధం శశ్వద్రోచతే గిరిసత్తమ| కు పథ్యం రోచతేeôభీక్ష్ణం మహాదోషకరం సదా || 52

నీవుపార్వతిని దానము చేయుటకు తగిన పాత్ర ఆయన కాదు. ఈ విషయమును విన్నంతనే మహాజనులు నవ్వెదరు (49). ఓ పర్వతరాజా! గమనించుము. ఆయనకు బంధువు ఒక్కడైననూలేడు. నీవు మహారత్నములకు నిధివి. ఆయన వద్ద ధనము లవమైననూ లేదు (50). ఓ పర్వత రాజా! బంధువులను, మేనకను, కుమారులను, మరియు ఇతరులనందరినీ శ్రద్ధతో అడిగి చూడుము. పండితులను కూడ ప్రశ్నించుము. కానీ పార్వతీని ప్రశ్నించవద్దు (51). ఓ పర్వతరాజా! ఏనాడైననూ రోగికి మందు రుచించదు. రోగికి అన్ని వేళలా మహాదోషకరమగు చెడు పథ్యము బాగుగా రుచించును (52).

బ్రహ్మోవాచ |

ఇత్యుక్త్వా బ్రాహ్మణః శీఘ్రం సవై భుక్త్వా ముదాన్వితః | జగామ స్వాలయం శాంతో నానా లీలా కరశ్శివః || 53

ఇతి శ్రీ శివ మహాపురాణ    రుద్ర సంహితాయాం పార్వతీ ఖండే శివమాయా వర్ణనం నామ ఏకత్రింశోeôధ్యాయః (31).

ఆ బ్రాహ్మణుడిట్లు పలికి ఆనందముగా భుజించి శీఘ్రమే నిర్గమించెను. అనేక లీలలను ప్రదర్శించు శివుడు శాంతముగా తన ధామమునకు చేరుకొనెను (53).

శ్రీ శివ మహాపురాణములోని రుద్ర సంహితయందు పార్వతి ఖండలో శివమాయావర్ణమనే ముప్పది ఒకటవ అధ్యాయము ముగిసినది (31).